శ్రీ

---

# భారతీనిగమోపలక్షణము.

శ్రీ కాశీస్థ రాజకీయ ప్రధాన
సంస్కృతపాఠశాలా మహామహోపాధ్యాయ
చతుర్దశాఽమరభాషా నిగమప్రతిజ్ఞాత
సర్వంకషసాహితీపాండితీ
నిరంతర నిరంకుశకవితా మహాధీరతా
చింతామణిధురంధర శ్రీమన్మానవల్లీకులపయోధి
రాకాశశధర శ్రీగంగాధరశాస్త్రి
ప్రియాంతేవాసి, గుంటూరుపురవాసి,
దేవాంధ్రభాషానిష్ణాత శ్రీమదేకాన్వయాభిజాత
శ్రీ సీతారామశాస్త్రి ప్రణీతంబియ్యది.

కే. బి. కృష్ణారావుచే
గుంటూరు, వాణీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1912

శ్రీరస్తు.

ఉ. బాలురుసత్కళాగ్రహణ♦పాటవయుక్తసదంతరంగులై
మేలువచించుతీర్థగుణ♦మేదురలక్షణులందుఁగూర్మిమై
చాలనయప్రకారసుని♦సర్గవినిశ్చలతన్ సదాగుణా
వాలము భారతీనిగమ♦వాఙ్ముఖమియ్యది వేగ్రహింపుడీ.

చ. సుగుణవిశాలచిత్త పరి♦శోధితవృత్తు లుదారబోధకుల్
మిగులదయాళుతన్ గమల♦మిత్రులభంగిని మైత్రిఁబూనిమేల్
నగలనుజూపుచున్ గృతమ♦నస్కుల బాలుర కెల్ల భారతీ
నిగమసువాఙ్ముఖంబు నెఱ♦నేర్పునఁదెల్పుడి వేగ్రహింపుడీ.



ఇందు జీవాత్మస్థితిగతులు, విద్యల యావశ్యకత, చతుర్దశవిద్యల విషయప్రయోజనములనిరూపణము, ప్రాచీనయోగ్య మహామునుల తాత్పర్యము లివి సులభంబుగ సంక్షేపంబున గ్రహింపఁబడుఁ గాన భాషాభిలాషకు లేతదాసక్తమానసు లగుదురుగాత. గుణములెంచి దోషముల క్షమింతురుగాత.

బుధప్రత్యయభూషితము,

సహృదయభాషితము,

విధేయుఁడు,

ఏకా సీతారామశాస్త్రి.

క. కుచకోకమిథునకలితము
కచశైవాలాఢ్యవదన•కంజము, హారికిన్
సుచరిత్రపాత్రవాపిక
యచలాగతి, సారసంప•దయనములిడుతన్.

క. గుణసంతతమృదుముకుళము
మణికంకణజాతగణిత•మానమహంబున్
ప్రణిధిప్రపదరాంకదయా
గుణపాథోనిధిసుబంధు•గురుమతినెంతున్.

క. యౌవన ముద్రాంకితగుణ
పావనము, మనోజతల్ప•భావనమును సం
జీవనముప్రేమలతలకు
యౌవనము, రసజ్ఞసౌభ•గావనమిలలోన్.

క. శస్తసుమిత్రసగంధము
న్యస్తమహాదేవచరణ•నళినద్వయమున్
ప్రస్తుతవసుసతదక్షిణ
హస్తము, సుపరిగ్రహోఽవి•హస్తముదలఁతున్.

క. ధనబంధురయఃకర్మలు
జవసన్నుతభంగిఁగలుగ•సంతుఁడుమదిలోఁ
దనయాత్మభారతీపతి
గననేర్చిన, వానిపగిది•గణియింతుధరన్॥

ఓమ్.

గణేశాయనమః.

# నవరత్నములు.

మత్త. గండశైలతులాఽఽలయాఽమల♦గండమండలనిస్సర
ద్దానవారిసుగంధసంగత♦భృంగమండలమండితం
చండభండజనాఽతిఖండన♦పండితంధృతకుండలం
వక్రతుండముపాశ్రయే సుబృ♦హత్ప్రచండమఖండితం.

(2) విఘ్నపర్వతమర్మదారణ♦కర్మధూర్వహదృగ్లసం
సర్వపూర్వసుపర్వపుంగవ♦వర్గగర్వవిచూర్ణకం
ఊర్వశీముఖగీర్వరస్తుత♦నూర్తదుర్గతిచర్వకం
శర్వసూనుమఖర్వశర్మద♦మర్చయామిగజాననం.

(3) నాగరాజికృతాఽఽయతాఽమల♦యజ్ఞసూత్రవిరాజితం
(1)నాగరాజివిలోలలోచన♦కైరవామృతదీధితిం
నాగరాజిసమృద్ధనిస్తుల♦సంపదర్పణదక్షిణం
(2)నాగరాఽఽజిహరంశ్రయే మహో♦నిలలోహితబాలకం.

(4) తారణాయభవోధధేరప♦వారణాయవిపత్తతేః
దారణాయసునిర్దయంబహు♦దారుణాఽహితసంతతేః
సారణాయచదుర్ధియాంకరు♦ణామయంశరణాగతే
వారణాఽఽననమాశ్రయేఽతరు♦ణాఽరుణవిగ్రహం.

---

(1) నగరాజస్యాపత్యం నాగరాజీః పార్వతీ॥

(2) నాగరాణామాజేర్యుద్ధస్యహారో నివారకస్తం.

(5) బుద్ధిసిద్ధికరాఽబ్జలాలిత • చారుచామరవీజితం
బుద్ధివృద్ధికరం సురాఽసుర • సేవితాంఘ్రిసరోరుహం
గృద్ధిశుద్ధివిధాయినం ధన • ధాన్యసంతతిదాయినం ,
విద్ధిచిత్త? రయాద్ధితం ప్రణ • మద్ధితం గణపం గతిం.

(6) భవ్యభూషణభారభాసుర • రత్నభాభరితాంగకం
ఫాలభాగవిశేషభాస్వర • శర్వరీశ్వరశోభితం
భారతీపతిభావగర్భిత • భాషితస్తుతవైభవం
భాగ్యలభ్యపదాంబుజం హృది • భావయామి భవాత్మజం.

(7) ఇందుచందనచంద్రశీతల • కీర్తిసుందరమందిరం
నమ్రమందజనాతిమందిమ • భక్షణాదివతుందిలం
నందనందననందనాధిప • పూజ్యముందురువాహనం
స్కందబంధుమనిందితేందిర • మేమితందురితాపహం

(8) మోహసంతమసంతతం హృది • సంతతం కరుణావశాత్
సంహరంతమనంతసమ్మద • సంతతిప్రతిపాదకం
అంతకాంతకకాంతసంతతి • చూళిలోహితకం నృణాం
భూరిదంతమదంతమాపద • మేకదంతముపాస్మహే.

(9) రామశాస్త్రివినిర్మితం శుభ • వర్ణరత్నవిరాజితం
పద్యమాల్యమిదం గుణోజ్జ్వల • మాదరాత్పురతోఽర్పితం
లుంఠితాహిత! నీలకంఠజ • దేవరాజకృతస్తుతే?
కుంఠితాఖిలవిఘ్నకంటక • కంఠభూషణమస్తు తే. శ్రీ. శ్రీ.

---

శ్రీరస్తు.

ఓం శ్రీవిష్ణువల్లభాయనమః.

# భారతీనిగమోపలక్షణము.

త్రిపదా॥ ఓం॥ జీవరత్నమయోద్ధాత్రీ మాత్మవిద్యాంచ ధీమహి। శక్తింయోనః ప్రచోదయాత్॥

ఉ॥ శ్రీసుమనోమనోరమను జెన్నుగమారుపచించు చిల్కచే
బాసలుకూడ పల్కఁబడు పాటవముం గలుగంగ, సౌరభో
ల్లాసతరంగిణీ మునుఁగ లాలితస్వచ్ఛపదాస్పదంబుఁగా
జ్ఞేసినతుల్, నుతింతునవనిం బుధులం సకలావతంసులం॥

సకలకలాకలాపసువిలాసలాలితంబగు నివ్విపులాతలంబున లోకోపకార ధర్మకర్మముల నాచరించు తపోధనులు, శ్రుతిస్మృతివిహితాచారవంతులగు కోవిదులు, సకలలౌకికాలౌకికనయాచారవర్మ ధురీణులు, సకలవ్యాపారజయలాభవంతులగు శ్రీమంతులు, హలాదిజీవనయోగక్షేమపరులగు కృషికారులును, మహాపాతకోపపాతకాపహరణ సమర్థంబులగు పుణ్యతీర్థ క్షేత్రంబులు, వివిధవగధజాలరూపంబులగు తుంగధరాధరంబులు, పశుపతంగ భృంగాదుల జీవనాధారంబులగు కాంతార ప్రదేశంబులు, నవరత్న పంచలోహాది ఘనీభూతంబులగు మహా ఖనిజాతంబులు నిట్లు చరాచర రూపంబు లెల్ల లోకయాత్రాపరులకు గోచరంబులగుట యెల్లవారికిఁ దెలియ

వచ్చుచున్నవి గదా. వ్యాసవశిష్ఠ భృగు నారద సనత్కుమారాది తపోధన గరిష్ఠశిష్ట మహాజనులు పరమేశ్వరాజ్ఞానుసారమున రూపాంతరములు వహించి లోకవేదస్థితి ప్రవృత్తులకై నియుక్తంబులగు మహాధికారతంత్రములచే జగంబునకు హితోపదేశపాండిత్యమున మహోపకారంబులఁ జేయుటంబట్టిగదా లోకయాత్ర ప్రవర్తిల్లెడిని. వారువారి సంప్రదాయకృతకృత్యులును విధితంతు విచ్ఛేదము గావింపక యాచరించుచున్న వారయి, యాత్మానాత్మాదిసదసద్విచారపూర్వకంబుగ వ్యవహరించి, సద్గతి ప్రతిపాదక వివేకమార్గముల ననేక ప్రకారములుగ సాధనోపాయంబుల బోధించి, యాత్మవిద్యాస్వరూపము ప్రదర్శింపఁ జేసినవారైరి. ఇదియె పరమగమ్యాస్పదమనుచు వితుచ్ఛంబులు త్యజించి స్వచ్ఛగుణపదార్థంబుల నిర్వేశించుచున్నవారై కృతమతులు త్రికరణశుద్ధి పూర్వకంబుగఁ బరమానంద రసమాస్వాదించుచున్నవారలు. లేనిచో నంధలాంగూలనయంబున దుర్జాతకూపాంధకారముల విహరించుచుం దరినుద్గమింపలేమిం జేసి సకలావస్థల దుఃఖమునే యనుభవింప వలసివచ్చెడినిగద. ఆత్మకంటెఁ బ్రియతరంబగుద్రవ్యము, విద్యకంటె నధికతరసుఖకరంబగు సాధనము లేదనుటస్పష్టము. లోకంబున నీచకాకంబు సహితము నిజనీడ నివాసముచేయుచున్నచో నిబిడస్వానందము పొందుచున్నయది కాని, లేనిచో నయ్యది తుంగమహాసౌధాగ్రముననున్నను గరుడాయితంబగునా? అయ్యా దగుటంబట్టి యిట్టి యాత్మవిద్యాఫలంబు పుణ్యకర్మపరిపాకంబునఁగాని పొందుట యసాధ్యంబు.

"యథావృక్షస్యసంపుష్పితస్య దూరాద్గంధోవాత్యేవం పుణ్యస్యకర్మణో దూరాద్గంధోవాతి యథాఽసిధారాంకర్తేఽవహితామవక్రామే యద్యువేయువేహావా విహ్వాయిష్యామికర్తం పతిష్యామీత్యేవ మమృతాదాత్మానం జుగుప్సేత్."

లోకమునందు నుద్యానవనాదుల సంవికసిత పరిమళపుష్పంబులుగల వృక్షముయొక్క సురభిళము వాయుసహాయంబున దూరదేశమునుండి యెట్లుగొట్టుచున్నదో, యట్లే పుణ్యకర్మవాసనయు దూరస్థమనుష్యలోకంబుననుండి యూర్ధ్వలోకంబున సంక్రమించెడిని. మఱియు నొకానొకనిపుణ్యశాలి యగాధంబగు గర్తంబునఁ బ్రసారితంబగు నసిధారపై గమనించినచో నతఁడు "దృఢముగా నసిధారపై నాచరణము స్పృశించిన ఛేదించుకొనిపోవునుగదా లేక దానినంటక ప్రక్రమించిన నగాధగర్తపాతముసంభవించునుగదా. అప్పుడు విహ్వలాంగుఁడ నయ్యెదను." అని యివ్విధంబున నాతండు విచారించును. అట్లే పాపమును బ్రకటముగాఁజేసిన లోకమున నిందితుండగును. అప్రకటముగాఁజేసినను నరకపాతము సంభవించునని పురుషుఁడు పాపంబునుండియు మోక్షప్రాప్తినింబట్టియుఁ దన యాత్మను జుగుప్సచేయవలయు. ఇట్లు పుణ్యము జ్ఞానసాధనంబగుట ప్రశస్తము. పాపము జ్ఞానప్రతిబంధకమగుట నిందితము. కాబట్టి సముచితపరికరజాల మావహిల్లినప్పుడే జీవునకు నట్టి పుణ్య మాచరించుట క్రమముగ సద్గతిప్రాప్తికి హేతువయ్యెడిని. జీవకోశమున నిళా, పింగళా, సుషుమ్నా, సరస్వతీ, గాంధారీ, హస్తిజిహ్వా, కుహూ, పూషా, యశస్వినీ, చారణాఽ

లంబుసా, విశ్వా, శంఖినీ, పయస్వినులను నీ పదునాలుగునాడులు ప్రాణవాహినులై, జ్ఞానకర్మేంద్రియవ్యాపారములకు గుణాగ్రాహకములుగ నుపయోగింపఁబడినవై, ప్రతిష్ఠింపఁబడినవి. అందుఁ జంద్రదేవతాకము రజోగుణప్రధానంబునగు నిలానాడియు, సూర్యదేవతాకము తమోగుణప్రధానంబునగు పింగళానాడియు, వాయు (విష్ణు) దేవతాకము సత్వగుణప్రధానంబునగు సుషుమ్నానాడియు నియ్యవి బ్రహ్మద్వారమున నాశ్రయించుకొనియుండెడి. తామరమొగ్గవలె నగ్రమునందు రంధ్రముగలిగి యధోముఖంబై, నాభి కూర్ధ్వముననుండెడు నంగుష్టమాత్ర పరిమిత హృత్పుండరీకము బ్రహ్మనివాసస్థానముగ నున్నయది. పితృలోకప్రాప్తిహేతుభూతంబులగు సత్కర్మలుచేసినవారిని యజ్ఞాదిపుణ్యకర్మలుచేసినవారిని, నుచ్ఛ్వాసనిశ్వాసముల కాధారభూతంబులగు నియ్యిలాపింగళానాడులు, మూలాధారంబుననుండి వెడలి హృత్పుండరీకవామదక్షిణభాగంబుల శిరమందుండు సహస్రారచక్రమునాధారముచేసికొని, పితృయాన దేవయాన సంజ్ఞకంబులై, చంద్రవహ్ని మండలముల వ్యాపించి ధూమాదిమార్గముగ, నర్చిరాదిమార్గముగను పితృలోక దేవలోకములఁ జెందునటులఁ జేయును.

మఱియు సర్వప్రపంచాత్మక పరంజ్యోతిస్వరూపియగు బ్రహ్మ సుషుమ్నానాడియందు నివసించెడిని. ఇయ్యది శుద్ధబ్రహ్మమునకు రూపాంతరములుగనుండెడి సూర్యచంద్రాగ్ని పరమేశ్వరులకును, పంచభూతంబులకును, చతుర్దశలోకంబులకును, దశదిక్కులకును, కాశ్యాది ధర్మక్షేత్రములకును, సప్త

సముద్రములకును, మేర్వాది పర్వతములకును, రత్నాది శిల
లకును, సప్తద్వీపములకును, గంగాది నదులకును, వేదశాస్త్ర
ములకును, చతుష్షష్టివిద్యలకును, బ్రాహ్మణాది జాతులకును,
అకారాది వర్ణోదాత్తాది స్వరములకును, సప్తకోటి మహామం
త్రములకును, సత్వరజస్తమోగుణంబులకును, మహదాదిచతు
ర్వింశతి తత్త్వములకును, క్షేత్రజ్ఞ జీవప్రాణాదినాగాదివాయూ
పవాయుప్రభృతి సమస్తప్రపంచమునకు నాధారంబుగనున్న
యది. బ్రహ్మలోకప్రాప్తిహేతుభూతదహరాద్యుపాసనలఁ జేసిన
వారిని యియ్యది మూలాధారంబునుండి వెడలి సూక్ష్మరూపమై
బ్రహ్మదండద్వారముఁ జొచ్చి బ్రహ్మరంధ్రమూలముగ సూర్య
మండలమువరకు వ్యాపించి బ్రహ్మలోకమును గలుగఁజేయు
ను. అయ్యదిగాన నింతకును సత్కర్మములాచరించువారికి నె
వ్విధంబుననైనను సద్గతిగలుగుట దెలియవచ్చెడిని. మఱియు
జీవుఁడు హస్తిమశకాది నానావిధదేహంబులందు సంకోచవికా
సంబులచే సంచరించుచున్నవాఁడై హృత్పుండరీకమందుండి
యంగుష్ఠమాత్రుండని వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఇంతియ
కాక, భాస్కరుఁడు స్వమండలప్రకాశమునకై దీపాదిప్రకాశ
ము నెట్లపేక్షింపఁడో, యట్లె వస్తుస్ఫూరణ శబ్దధ్యానాభివాదా
ది క్రమనియమనంబులకై మనోపేక్షగలిగినను, జీవుఁడు చేత
నుఁడుగాన స్వాత్మవిద్యానందముకై యన్యసాధన మపేక్షింప
క యుండును. మరియు జీవుఁడు క్షేత్రకళత్రాదుల నుపభోగ
విషయంబుల సంకల్పాహంకారములతోడను, లయోదయ
రూపంపగు బుద్ధిగుణంబుతోడను, నాత్మగుణంబగు స్వయంప్ర

కాశముతోడను, నాడులందు నిరాటంకముగ సంచరించుటకు నతిసూక్ష్ముఁడై పరమాత్మకంటె నికృష్టుండయ్యెడిని. ఈజీవాత్మకు స్వస్వామిభావసంబంధము కర్మనిమిత్తంబగుటంబట్టి సుఖదుఃఖరూప పుణ్యపాపలక్షణ కర్మఫలానుసారంబున నానాదేహంబుల సదసద్యోనియోగభవంబులు గలుగుచున్నవి కర్మములకు నధిష్ఠానము, కర్త, కరణము, చేష్ట, దైవ మను నియ్యైవి పంచహేతువులు కాన జీవుఁడు ముఖ్యప్రాణాధిపతియై, సేంద్రియమనస్కుఁడై, విద్యాకర్మ పూర్వప్రజ్ఞాపరిగ్రహములు కలవాఁడై దేహమువదలి దేహాంతరముగ్రహించుచున్నాఁడు. తత్తదింద్రియాధిదేవతలు తత్తజ్జీవులకుఁ దత్తదదృష్టంబునఁ దత్తత్కర్మఫలభోగముల నాకర్షింపఁజేయుచున్నవై, ప్రకృతి గుణాంబునఁ దత్తత్కృత విధివశంబునను, బరావరలోకానుభవంబులు గలుగఁజేయుచున్నవై, కర్మపరిపాకంబునను గాలవశంబునను గ్రమముగ సద్గతినిఁబొందింపఁజేయుచున్నవి. అయ్యంగదేవతలఁ దనప్రత్యయవిధిని లోఁబఱుచుకొని సద్గతికై పాటుబడుచు నాత్మవిద్యను సంపాదించి యాత్మవిద్యాపరమానందము పొందు సాధుయువజీవరత్నముయొక్క భాగధేయ మేరికి గణింపఁదరము? కాన నివ్విధంబున నాత్మవిద్యకలుగుటయే జీవునకు సద్గతిలభించుటకదా. సాధనోపాయంబులు లేనిచోనట్టి యాత్మవిద్య దుర్లభముకాన,

శ్లో॥ శాస్త్రసజ్జనసత్కార్య సంగేనోపహతైనసాం
సారావలోకినీబుద్ధి ర్జాయతేదీపకోపమా॥

శాస్త్రాదివిద్యల పరిచయంబునను, సజ్జనసాంగత్యమునను, సత్కర్మకాండయోగంబునను, కలుషరహితాత్ములకు సారముగ్రహించుబుద్ధి దీపికవలెఁ దేజరిల్లెడిని. లోకవేదస్థితివిధిహేతుభూతంబగునదియు, సర్వదేవర్షి లోకవృత్తవ్యవహారయోగ్యంబగునదియు, నాత్మజ్ఞానముగలుగజేయునదియు, సకలానందకరంబును, నీ హిందూవసుంధరాధేనుకా భద్రముద్రాభరణంబును నగు నమరవిద్య జగంబునంగల్గు నెల్లవిద్యలకు మూలంబగుట యెల్లరకు విశదంబేగదా. అట్టివిద్యను బరిపాలించు లోకాధిపతిభాగ్యంబు లెక్కింప నశక్యమయ్యెడి. అయిన నీలోకంబున నియ్యమరవిద్యాశక్తికి నాద్యవృత్తకాలానుగతిని ప్రహాసదర్శనమున వ్యపదేశమాత్రము కాఁగలదని శంకింపవలదుగాని, తద్గుణసారమతులకు నట్టి విద్యాప్రభావము గానంబడియెడి.

చ. అగణితదీర్ఘ సల్ల సదపాంగతరంగితలోచనంబులన్
విగళితనీరజాలపదవీక్షణగాఁగమనోజ్ఞ వాణి, ము
జ్జగముల నేలుపంచశరుసాయకమెంచుఁ జొరంగదందునన్
సుగమము ప్రేమలక్షణముసొంపుగవాటిలు నెల్లభంగులన్.

ఉ. నెచ్చెలినింద్యజించి, నిజనీడముఁగానఁగలేమి, నిచ్చలున్
ముచ్చటలాడజాడ, తనమోము, చలింపవసంతదూతమున్
ప్రుచ్చు, నిజాక్షిగోచరనిరూఢిని, దానినిఁబట్టలేమి యే
హెచ్చగుఁ బ్రేమలక్షణముహిందువుమాధవుఁడెంచిమెచ్చెడిన్.

కాబట్టి యట్టి సారావలోకనబుద్ధిని సంపాదించుటకు విద్య యావశ్యకమైనది. భాషాభిలాషకులకుఁ బూర్వవాసన లేకపోయినను, గుణానుబంధ బంధురప్రతిభాకలాపము లేకపోయినను, శ్రుతయత్నముల నుపాసింపఁబడుచున్నదై, భారతీ మహాదేవి వినతాత్ముల నిక్కముగ నెక్కరణినైన ననుగ్రహించును. కాన నీ భారతీనిగమోపలక్షణమున సంక్షేపంబుగ నిగమోపనిగమాది నిరూపణవిషయంబుల యథామతిఁ దెలియఁ జేయంగోరి యిందు న్యూనాధికగుణదోషంబుల ధీరశిఖామణులు క్షమించుదురని ప్రార్థించుచున్నాడను.

శ్రీరస్తు.—— లోకంబున గాయత్రీవేదమాతకుమించిన పరదేవతయు, నిగమమునకుమించినపరవిద్యయు లేదనుటస్పష్టము. "త్రయి"యనునామము ఋగ్యజుస్సామంబుల కభిహితము. అందు నష్టాదశవిద్యలు వివక్షితంబులు. వేదములు ఋగ్యజుస్సామాథర్వంబులని చతుర్విధంబులు. శిక్ష, వ్యాకరణము, జ్యోతిషము, ఛందస్సు, నైరుక్తము, కల్పంబను నీ యారువేదాంగములు. పురాణములు, న్యాయము, మీమాంస, ధర్మశాస్త్రము లివి యుపాంగములు. అందు నుపపురాణములు పురాణంబుల, వైశేషికశాస్త్రము న్యాయంబున, వేదాంతము మీమాంస యందున, మహాభారతరామాయణాదులు, సాంఖ్య పాతంజల పాశుపత వైష్ణవాదులును, ధర్మశాస్త్రంబుల నంతర్గతంబులు. ఇవి యన్నియు సమ్మేళించి చతుర్దశవిద్యలు నాఁబడు.

శ్లో॥ పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః
వేదాఃస్థానానివిద్యానాం ధర్మస్యచచతుర్దశ॥

ఇయ్యవి చతురుపవేద సహితంబులై యష్టాదశవిద్య లయ్యెడిని. ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థశాస్త్రమను నివి యుపవేదములు. పూర్వోక్తంబులెల్ల త్రయీనామంబున నుపన్యస్తములు. ఆస్తికులకెల్లరకు భువనస్థ సమస్తశాస్త్రప్రస్థానంబు లివియె యాదరణీయంబులు. మఱికొంద ఱేకదేశికులానుకూలికులయ్యెదరు. కాని నాస్తిక ప్రస్థానాంతరములు వేరుగా గణింపఁబడుటంజేసి శూన్యవాదంబున మాధ్యమికులయొక్కయు, క్షణికవిజ్ఞానమాత్రవాదంబున యోగాచార్యులయొక్కయు, జ్ఞానాకారానుమేయక్షణిక బాహ్యార్థవాదంబున సౌత్రాంతికులయొక్కయుఁ, బ్రత్యక్షులక్షణక్షణికబాహ్యార్థవాదంబున వైభాషికులయొక్కయుఁ బ్రస్థానాంతరములు మ్లేచ్ఛాది ప్రస్థానములవలె వేదబాహ్యంబులు పరంపరాయోగమునఁ బురుషార్థములకనుపయుక్తంబులుగాన యిందు నుపేక్షణీయంబులు. ఇట సాక్షాద్యోగంబునఁ బరంపరాయోగంబుననైనఁ బురుషార్థోపయోగకరములగు ప్రస్థానములు ప్రదర్శితంబులు. బాలురసుఖబోధకై సంక్షేపముగఁ దద్రూపఫలభేదంబు లిందుఁ జూపఁబడెడిని.

వేదములు:—వేదంబన నపౌరుషేయంబయ్యు ధర్మ బ్రహ్మ ప్రతిపాదకంబగు ప్రమాణవాక్యము. అది మంత్ర బ్రాహ్మణరూపంబగు మంత్రము లనుష్ఠానకారకభూతములు ద్రవ్య దేవతా ప్రకాశకంబులు. అయ్యవి ఋగాది త్రివిధంబులఁ బాదబద్ధంబులై గాయత్ర్యాది ఛందోవిశిష్టంబులగు ఋక్కులు "అగ్నిమీళే" ఇత్యాదులు. అవియె గీతివిశిష్టంబులు సామ

ములు. తదుభయలక్షణములు యాజుషంబులు. "అగ్నీదగ్నీన్ విహారేత్" ఇత్యాది సంబోధనరూపంబులగు నిగదమంత్రము లుకూడ యుజురంతర్గతములు.

బ్రాహ్మణము :—ఇది విధిరూపము, అనువాదరూపము, తదుభయలక్షణంబని త్రివిధంబు. శబ్దభావనంబు విధియని భట్టమతము. నియోగంబె విధియని ప్రాభాకరసమ్మతము. ఇష్టసాధనతావిధియని తార్కికాదుల యిష్టంబు. ఉత్పత్త్యధికారవినియోగప్రయోగంబులనివిధి చతుర్విధంబు. అందుఁ గర్మస్వరూప మాత్రమును బోధించునది యుత్పత్తివిధి. "ఆగ్నేయో౽ష్టకపాలో భవతీ"త్యాది. సేతికర్తవ్యతాకము యాగాదికరణఫల సంబంధమును బోధించునది యధికారవిధి. "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" ఇత్యాది. అంగసంబంధమును బోధించునది వినియోగవిధి. "వ్రీహిభిర్యజేత, సమిధోయజతి" ఇత్యాది. సాంగప్రధాన కర్మైక్యమును బోధించునదియు నుక్తవిధిమిశ్రమరూపంబగునది ప్రయోగవిధి. శ్రౌతము, కల్ప్యంబని చెప్పంబడును. గుణార్థవిభాగంబునఁ గర్మ స్వరూపము ద్వివిధము. అందుఁ గ్రతుకారకంబుల నాశ్రయించి విహితంబగు గుణకర్మ చతుర్విధంబు. ఉత్పత్తి, ఆప్తి, వికృతి, సంస్కృతి. "వసంతే బ్రాహ్మణో౽గ్నీనాదధీత, యూపంతక్షతి." ఇత్యేటనాధానతక్షణాదులచే సంస్కారవిశేషవిశిష్టంబులగు నగ్నియూపాదులయుత్పత్తి. "స్వాధ్యాయో౽ధ్యేతవ్యః, గాంపయోదోగ్ధి". ఇటనధ్యయనదోహనాదులచే విద్యమానస్వాధ్యాయపయః ప్రభృతులప్రాప్తి. "సోమమభిషు

ణోతి, వ్రీహీనవహంతి, ఆజ్యంవిలాపయతి” ఇయ్యెడనభిషవావఘాతవిలాపనంబులచే సోమాదుల వికారము. “వ్రీహీన్ ప్రోక్షతి, పత్న్యవేక్షతే” ఇందుఁ బ్రోక్షణావేక్షణాదులచే వ్రీహ్యాది ద్రవ్యముల సంస్కారము. క్రతుకారకముల నాశ్రయింపక విహితంబగు నర్థకర్మ్మయంగము, ప్రధానంబని రెండువిధములు. అన్యార్థమంగము. అనన్యార్థము ప్రధానము. సన్నిపత్యోపకారకము, ఆరాదుపకారకంబనియంగము ద్వివిధము. అందుఁ బ్రధానరూప నిర్వాహకము ప్రథమము. ఫలోపకారి ద్వితీయము. ఇట్టుల సంపూర్ణాంగయుక్తంబగు విధిప్రకృతి. వికలాంగయుక్తంబు వికృతి. తదుభయ విలక్షణము దర్వీహోమాది. ఇవ్విధంబున నన్యము లూహ్యంబులు.

అనువాదము:—ప్రాశస్త్యనిందాలక్షణలచే విధిశేషభూతంబగు వాక్యము. గుణవాదము, అనువాదము, భూతార్థవాదంబని త్రివిధంబు. ప్రమాణాంతరముల విరుద్ధార్థముల బోధించునది గుణవాదము. “ఆదిత్యోయూపః” ఇత్యాది. ప్రమాణాంతర సిద్ధార్థములబోధించునది యనువాదము. “అగ్నిర్హిమస్యభేషజం”ఇత్యాది. ప్రమాణాంతర విరోధంబునఁ బ్రాప్తిరహితార్థంబుల బోధించునదిభూతార్థవాదము. “ఇంద్రోవృత్రాయ వజ్రముదయచ్ఛత్” త్రివిధంబులగు నర్థవాదములు సమానవిధిస్తుతిపరంబులయ్యు దేవతాధికరణనయంబునస్వార్థంబున భూతార్థవాదములకుఁ బ్రామాణ్యంబు దోఁచెడిని. ప్రామాణ్యమన నబాధితాజ్ఞాతజ్ఞాపకత్వము. అయ్యది బాధితవిషయంబు జ్ఞాతజ్ఞాపకంబును గాన గుణవాదమను

వాదమును బట్టఁ జెల్లదు. భూతార్థవాదము స్వార్థమందు తాత్పర్యరహితమయినను నౌత్సర్గిక ప్రామాణ్యమునకు విఘాతంబు కానేరదు.

విద్యర్థవాద విలక్షణము వేదాంతవాక్యము.—ఇయ్యది యజ్ఞాతజ్ఞాపకంబయ్యు ననుష్ఠానా ప్రతిపాదకముగాన విధిభిన్నంబు. స్వయంపురుషార్థ పరమానందాత్మక బ్రహ్మమందు స్వార్థంబున నుపక్రమోపసంహారాది షడ్విధతాత్పర్యలింగములుకలుగుటచే స్వయంప్రమాణభూతమై, సర్వవిధుల నంతఃకరణశుద్ధి వ్యాపారంబున స్వశేషత్వము లేమింజేసి, యను వాదంబు కానేరదు. దానింబట్టి యుభయ విలక్షణంబు వేదాంత వాక్యము. మఱియు నెక్కుడెడ నజ్ఞాతజ్ఞాపకత్వమాత్రంబున విధిపరరహిత ప్రమాణ వాక్యంబునను భూతార్థ వాదంబగునని వ్యవహరింపఁబడుట దోషంబుకాదు.

కర్మకాండ బ్రహ్మకాండాత్మకంబగు వేదము పురుషార్థకారణము. ఇయ్యది ప్రయోగత్రితయంబున యజ్ఞనిర్వాహార్థమై ఋగాదులచే భిన్నంబు. అందు ఋగ్వేదమున హౌత్రప్రయోగము, యజుర్వేదంబున నాధ్వర్యవప్రయోగము, సామవేదంబున నౌద్గాత్రప్రయోగము. బ్రహ్మత్వయాజమాన ప్రయోగంబు లిందంతర్గతములు. అధర్వవేదము యజ్ఞానుపయుక్తమై శాంతికపౌష్టికాభిచారికాది కర్మప్రతిపాదకంబుగాన, నత్యంత విలక్షణము. ఇట్లు ప్రవచనభేదంబునఁ బ్రతివేదంబు భిన్నభిన్నశాఖలయ్యెడిని. కర్మకాండంబున వ్యాపారభేదమున్న

ను బ్రహ్మకాండమున సర్వవేదశాఖ లేక రూపంబగుటంబట్టి ప్రయోజనభేదమునఁ జతుర్వేదములు భిన్నంబులు.

శిక్ష :— ఉదాత్తానుదాత్తస్వరితఘటితంబుల హ్రస్వదీర్ఘప్లుతాది విశిష్టంబుల స్వరవ్యంజనాత్మక వర్ణంబుల సముచ్చారణ విశేషజ్ఞానము దీని ప్రయోజనము. లేనిచో మంత్రముల కనర్థఫలము. తదుక్తము —

శ్లో॥ మంత్రోహీనః స్వరతోవర్ణతోవా।
మిథ్యాప్రయుక్తోన తమర్థమాహ।
సవాగ్వజ్రోయజమానంహినస్తి
యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్॥

సర్వవేదసాధారణంబగుశిక్ష "అథశిక్షాం ప్రవక్ష్యామి" ఇత్యాద్యేకాదశకండికాత్మకము పాణినిభగవానునిచేఁ బ్రకాశింపఁబడియె. ప్రతివేదశాఖంబు భిన్నరూపంబు లగుటంబట్టి ప్రాతిశాఖ్య సంజ్ఞితమగునది యన్య ముని ప్రకటితంబు.

వ్యాకరణము :—వైదికపదసాధుత్వ జ్ఞానంబున నూహాదికంబు దీని ప్రయోజనంబు "వృద్ధిరాదైచ్" ఇత్యాద్యష్టాధ్యాయాత్మకంబై మహేశ్వర ప్రసాదమునఁ బాణినిమునివర్యునిచేఁ బ్రకాశితంబయ్యె. తదుపరి కాత్యాయనమునిచే వార్తికముపతంజలిచే భాష్యమును రచింపఁబడియె. ఇయ్యది త్రిముని వ్యాకరణ మమామహేశ్వరమనంబడి వేదాంగమయ్యెడిని. కౌమారాది వ్యాకరణములు లౌకిక ప్రయోగ మాత్రజ్ఞానార్థంబులు.

నిరుక్తము :—శిక్షావ్యాకరణంబుల వర్ణోచ్చారణపద సాధుత్వజ్ఞానము గలుగంజేసి వైదిక మంత్రపదంబుల యర్థజ్ఞానమపేక్షించి తన్నిమిత్తము "సమామ్నాయః సమామ్నాతః సవ్యాఖ్యాతవ్యః" ఇత్యాది త్రయోదశాధ్యాయాత్మకము యాస్కమహాముని చే రచింపఁబడియె. మంత్రములయనుష్ఠేయార్థద్వారంబునవాక్యార్థజ్ఞానము, కరణము, పదార్థజ్ఞానాధీనము గాన మంత్రార్థజ్ఞాన నిమిత్తమై నిరుక్త మవశ్యమపేక్షితంబు. లేనిచో ననుష్ఠాన మసంభవమయ్యెడి, "సృణ్యేవజర్భరీతుర్ఫరీ" త్యాద్యతిదురూహంబుల ప్రకారాంతరార్థజ్ఞానమసంభావనీయమయ్యెడిని. అందు నామ మాఖ్యాతముపసర్గము నిపాతంబను నీ చతుర్విధంబులగు పదజాతంబుల నిరూపించి వైదికమంత్రపదార్థంబులఁ దెలియంజేసి, వైదిక ద్రవ్యదేవతాత్మక పదార్థపర్యాయ శబ్దాత్మకంబులగు నిఘంటువులుఁకూడ నిరుక్తాంతర్గతములె. నిఘంటు సంజ్ఞక గ్రంథము పంచాధ్యాయ్యాత్మకము యాస్కమహాముని ప్రణీతము.

ఛందస్సు :—మంత్రములు పాదబద్ధ ఛందోవిశేష విశిష్టంబులు. తదజ్ఞానంబున నిందా శ్రవణంబునంబట్టియు, ఛందోవిశేష నిమిత్తానుష్ఠాన విశేష విధానంబునంబట్టియు, ఛందోజ్ఞానమాకాంక్షించి తత్ప్రకాశనార్థమై "ధీ, శ్రీ, స్త్రీ," త్యాద్యష్టాదశకండికాత్మకంబగు ఛందోగ్రంథము పింగళమహాముని విరచితము. అందుఁ గండికాత్రయంబున "గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పంక్తి, త్రిష్టుప్, జగతీ" త్యాది సప్తఛందము లవాంతరభేదంబులతో నిరూపితంబులు. ప్రసం

గవశమునఁ బురాణాదుల నుపయోగించు లౌకిక ఛందములు ను వ్యక్తంబులు.

జ్యోతిషము :—వైదికకర్మాంగ దర్శ పూర్ణమాసాది కాలజ్ఞానార్థమై యియ్యది యాదిత్యగర్గాది మహామునుల చేఁ బ్రణీతంబయ్యె.

కల్పము :—శాఖాంతరీయగుణోప సంహారమున వైదికానుష్ఠాన క్రమవిశేష జ్ఞాననిమిత్తమై కల్పసూత్రములురచింపఁబడెను. అయ్యవి ప్రయోగభేదంబునఁ ద్రివిధంబులు. హౌత్రప్రయోగప్రతిపాదకము లాశ్వలాయనాది ప్రణీతములు. ఆధ్వర్యవప్రయోగ ప్రతిపాదకము లన్యకృతములు, ఔద్గాత్ర ప్రయోగప్రతిపాదకములు లాట్యాయన ద్రాహ్యాయణాది విరచితములు. ఇవ్విధంబున వేదాంగములు ప్రయోజనభేదంబున భిన్నములు.

పురాణములు:—సర్గ ప్రతిసర్గ వంశమన్వంతరవంశానుచరిత ప్రతిపాదకంబులగు నష్టాదశపురాణములు బాదరాయణ మహాముని ప్రణీతములు. బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యము, బ్రహ్మవైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మ్యము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము, ఉపపురాణములుకూడ బహువిధంబులు ద్రష్టవ్యంబులు.

న్యాయము:—అన్వీక్షకీనామకంబగు న్యాయశాస్త్రము, పంచాధ్యాయి, గౌతమమహామునిచే రచింపఁబడియె. ప్ర

మాణప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత సిద్ధాంతావయవతర్కనిర్ణయవాదజల్పవితండాహేత్వాభాసఛలజాతినిగ్రహస్థానాఖ్యంబులగు షోడశపదార్థంబుల నుద్దేశలక్షణపరీక్షాదులచేఁ దత్త్వజ్ఞానము కలుగుట దీనిప్రయోజనము. మఱియు వైశేషిక శాస్త్రము కణాద ప్రణీతము. భావపదార్థంబులగు ద్రవ్యగుణకర్మసామాన్యవిశేష సమవాయంబులయొక్కయు, నభావపదార్థముయొక్కయు సాధర్మ్యవైధర్మ్యప్రతిపత్తి కలుగుట దీని ప్రయోజనము.

మీమాంస :—ఇయ్యది కర్మమీమాంస, శారీరక మీమాంస యని రెండువిధములు. అందు ద్వాదశాధ్యాయి కర్మమీమాంస "అథాతో ధర్మజిజ్ఞాసా" ఇత్యాది "అన్వాహార్యేచదర్శనాత్" ఇత్యంతమునఁ జెప్పంబడినది జైమిని మహామునిచే రచింపఁబడియె. అందు ధర్మప్రమాణము, ధర్మభేదాభేదంబులు, శేషశేషిభావము, క్రత్వర్థపురుషార్థభేదము, ప్రయుక్తివిశేషము, శ్రుత్యర్థపఠనాదిక్రమభేదము, అధికారివిశేషము, ఊహము, వాదము, తంత్రము, ప్రసంగంబను నియ్యావిక్రమంబున ద్వాదశాధ్యాయంబులఁ బ్రదర్శింపఁబడియె. మఱియు సంకర్షణకాండమధ్యాయ చతుష్టయము జైమిని ప్రణీతము. అదిదేవతాకాండ సంజ్ఞచేఁ బ్రసిద్ధంబయ్యునుపాసనాకర్మ ప్రతిపాదకంబుగాన కర్మమీమాంసాంతర్గతము.

శారీరకమీమాంస.—చతురధ్యాయి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఇత్యాది "అనావృత్తిః శబ్దాత్," ఇత్యంతమున జీవ బ్రహ్మైక్యసాక్షాత్కార హేతు శ్రవణాది విచారప్రతిపా

దకంబులగు నధ్యాయములను బ్రదర్శింపుచున్నదై బాదరాయణ ప్రణీతమయ్యె.

ప్రథమమున—స్పష్టబ్రహ్మలింగయుక్తంబులగు వాక్యంబులు, అస్పష్ట బ్రహ్మలింగయుక్తములగు నుపాస్య బ్రహ్మవిషయకములు, అస్పష్టబ్రహ్మలింగవిజ్ఞేయ విషయకములు, ప్రధానవిషయత్వమున సందిహ్యమానావ్యక్తాజాదులును జింతితంబులయ్యె, సర్వవేదాంత వాక్యముల సాక్షాద్యోగంబునం బరంపరాయోగంబుననైనం బ్రత్యగభిన్నాద్వితీయబ్రహ్మమందుం దాత్పర్యము.

ద్వితీయమున—సాంఖ్యయోగకాణాద స్మృతులచేతను, దత్ప్రయుక్తతర్కములచేతను వేదాంత సమన్వయమునకు విరోధపరిహారము; స్వపరపక్షస్థాపనానిరాకరణరూప విచారంబున సాంఖ్యాది మతములకు దోషప్రతిపాదనము, మహాభూతసృష్ట్యాదుల పరస్పరవిరోధపరిహారము జీవవిషయంబులును, ఇంద్రియ విషయక శ్రుతుల విరోధపరిహారమును దెలియంబడ వేదాంతములకు బ్రహ్మ సమన్వయముసిద్ధముకాంగం దర్కాదివిరోధశంకాపరిహారంబున నవిరోధము.

తృతీయమున—జీవునకుం బరలోక గమనాగమననిరూపణంబున వైరాగ్యము, తత్త్వం పదార్థముల శోధనము, నానాశాఖాపఠితపునరుక్తపదోప సంహారము సగుణవిద్యలందు శాఖాంతరీయ గుణోపసంహారానుప సంహారములు, నిర్గుణబ్రహ్మవిద్యకు బహిరంగసాధనములగు నాశ్రమయజ్ఞాదులం

తరంగసాధనములగు శమదమాదులును దెలియంబడ సాధనని రూపణము.

చతుర్థాంబున—బ్రహ్మోపాసనా శ్రవణాద్యావృత్తులచే సగుణ నిర్గుణ బ్రహ్మను సాక్షాత్కరించి జీవునకుఁ బుణ్యాపాపాలేపసంక్షయమున జీవన్ముక్తి, మ్రియమాణోత్క్రాంతి ప్రకారము, సగుణబ్రహ్మవేత్తకు మృత్యనంతరోత్తర మార్గాభిధానము, సగుణనిర్గుణబ్రహ్మవేత్తలకు బ్రహ్మలోక విదేహ కైవల్యములును దెలియంబడ బ్రహ్మవిద్యల ఫలవిశేష నిర్ణయము. ఇదియె సర్వశాస్త్రములకుమూర్ధన్యము. శాస్త్రాంతరము లెల్ల నిందుపగమనించుఁ గావున సర్వమోక్షాభిలాషులకు నిదియె యాదరణీయము. శ్రీశంకర భగవత్పాదప్రత్యయ ప్రకారమునఁ సర్వసిద్ధాంతితము.

ధర్మశాస్త్రములు:—మనుయాజ్ఞవల్క్యవిష్ణుయమాంగిరోవసిష్ఠ దక్షసంవర్త శాతాతప పరాశరగౌతమ శంఖలిఖిత హారీతాపస్తంబోశనోవ్యాస కాత్యాయన బృహస్పతి దేవల నారద పైఠీనసిప్రభృతి మహామునులచే నియ్యవి వర్ణాశ్రమ ధర్మవిశేషములఁ బ్రతిపాదించునవియై రచింపఁబడియె. వాల్మీకి వ్యాసకృత రామాయణ మహాభారతంబు లితిహాసంబులనంబడి ధర్మశాస్త్రాంతర్గతములు.

ఆయుర్వేదము :— సూత్రము, శారీరము, ఇంద్రియము, చికిత్స, నిదానము, విమానము, కల్పము, సిద్ధి యను నివి యష్టస్థానము లిందుఁగలవు. బ్రహ్మ, ప్రజాపతి, అశ్వి, ధన్వం

తరి, ఇంద్రుడు, భరద్వాజుఁడు, ఆత్రేయుఁడు, అగ్నివేశుఁడు, మొదలగువారిచే నిది యుపదిష్టంబై చరకునిచే సంక్షేపింపఁబడెను. అందుననే సుశ్రుతునిచేఁ బంచస్థానాత్మక ప్రస్థానాంతరము చేయఁబడెను. ఇంకను వాగ్భట్టాదికృతంబు లనేకంబులు తెలియఁబడు. వాజీకరణంబను కామశాస్త్రము సుశ్రుతునిచే నభిహితంబుగాన నిం దంతర్భూతము. పంచాధ్యాయాత్మకంబగు కామశాస్త్రము వాత్స్యాయనవిరచితము. విషయవైరాగ్యము దీనిప్రయోజనము. శాస్త్రోద్దీపితమార్గమున విషయభోగమున దుఃఖమాత్రపర్యవసానము. చికిత్సాశాస్త్రమునకు రోగనివృత్తిసాధనజ్ఞానము ప్రయోజనము.

ధనుర్వేదము :— దీక్షాసంగ్రహాసిద్ధిప్రయోగపాదములుగలది విశ్వామిత్రప్రణీతము. ప్రథమమున- ధనుర్లక్షణము, అధికారనిరూపణము; ధనుష్ప్రముక్తము, అముక్తము, ముక్తాముక్తము, యంత్రముక్తమని నలుతెఱంగులు. ముక్తము చక్రాదులు, అముక్తము ఖడ్గాదులు, ముక్తాముక్తము శల్యావాంతరభేదము, యంత్రముక్తము శరాదులు. ముక్తమున కస్త్రమనియు, నముక్తమునకు శస్త్రమనియు వ్యవహారము. అయ్యవి బ్రాహ్మ వైష్ణవ పాశుపత ప్రాజాపత్యాగ్నేయాదు లనేకవిధంబులు. సమంత్రకముల, సాధితదైవతముల, నెవరికధికారముండునట్టి క్షత్రియకుమారుల సహచరులు పదాతి రథగజతురగారూఢులు నలుతెఱంగులు. ఇందు దీక్షాభిషేకశకున మంగళకరణాదికములు నిరూపితములు. ద్వితీయమున- సర్వశస్త్రవిశేషంబుల నాచార్యునకు లక్షణపూర్వకముగ సం

హారణప్రకారము. తృతీయమున- గురుసంప్రదాయసిద్ధములగు నస్త్రవిశేషముల పునఃపునరభ్యాసము మంత్రదేవతాసిద్ధికరణము. చతుర్థమున- దేవతార్చనాభ్యాసాదులచే సిద్ధములగు నస్త్రవిశేషముల ప్రయోగవిధానము. క్షత్రియుల స్వధర్మాచరణము, యుద్ధము, దుష్టదస్యుచోరాదులవలన ప్రజాపాలనము, ధనుర్వేదప్రయోజనము.

గాంధర్వము :—భరతునిచే రచింపఁబడియె. అందు గీత నృత్య వాద్యముల బహువిధార్థములు ప్రపంచితములు. దేవతారాధన నిర్వికల్పకసమాధ్యాదిసిద్ధి, గాంధర్వవేదప్రయోజనము.

ఇట్లే నీతిగజాశ్వసూపచతుష్షష్టికళాశాస్త్రము లర్థశాస్త్రము లివి నానామునులచే విరచితములు. లౌకికాలౌకిక ప్రయోజనభేదమున ద్రష్టవ్యములు.

సాంఖ్యము:—కపిలమహాముని విరచితము. "అథ త్రివిధదుఃఖాత్యంత నివృత్తిరత్యంత పురుషార్థః" ఇత్యాదిషడధ్యాయము. అందు విషయములు, ప్రధానకార్యములు, విషయవైరాగ్యము, విరక్తులగు పింగళాకురరాదుల యాఖ్యాయికలు, పరపక్షనిర్జయము, సర్వార్థసంక్షేపము తెలుపఁబడె. ప్రకృతిపురుషవిశేషజ్ఞానము దీనిప్రయోజనము.

యోగము :—పతంజలిప్రణీతము. "అథ యోగానుశాసనం" ఇత్యాది పాదచతుష్టయాత్మకము. అందుఁ జిత్తవృత్తినిరోధాత్మకంబగు సమాధియభ్యాసము, వైరాగ్యస్వరూ

పము, తత్సాధనమును; త్రిపుటీచిత్తునకు సమాధిసిద్ధికై యను నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణసమాధులగు నష్టాంగములు, యోగవిభూతులు, కైవల్యమును దెలుపఁబడియె. ఇందువలన విజాతీయప్రత్యయనిరోధద్వారంబున నిదిధ్యాసనసిద్ధియే ప్రయోజనము.

పాశుపతము:—పశుపతిమతము. పశుపాశవిమోక్షణకై "అథాతః పాశుపతం యోగవిధిం వ్యాఖ్యాస్యామః" ఇత్యాది పంచాధ్యాయాత్మకము. పశుపతివిరచితము. కార్యరూపుఁడగు జీవుఁడు, పశుకారణము పశుపతియగు నీశ్వరుఁడు, యోగము, పశుపతియందుఁ జిత్తసమాధానము, విధి భసిత త్రిషవణస్నానాదిప్రకారము లిందు నిరూపితములు. దుఃఖాత్యంతనివృత్తియే మోక్షము దీనిప్రయోజనము.

వైష్ణవము:—నారదాదివిరచితము. పంచరాత్రము. అందు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ నామకంబులగు చతుర్విధపదార్థములు ప్రకటితములు. వాసుదేవభగవానుఁడు సర్వకారణుండగు పరమేశ్వరుఁడనియు, వానిచే సంకర్షణాఖ్యుండగు జీవుఁడు కలుగుననియు, వానివలన మనోనామక ప్రద్యుమ్నుఁడు వానివలన ననిరుద్ధనామకాహంకారమును గలుగునని యిందుఁ జెప్పంబడు. పూర్వోక్తంబులెల్ల వాసుదేవాంశభూతంబులనియుఁ, దదభిన్నములనియు, మనోవాక్కాయవృత్తులచే వాసుదేవారాధనముచేసి జనుఁడు కృతకృత్యుఁడగునని యుఁ దెలియవచ్చెడిని.

ఇట్లు త్రయీశబ్దమున నష్టాదశవిద్య లెఱుఁగుటయుఁగాక లోకంబున ముప్పదిరెండువిద్య లరువదినాలుగు కళలనియుఁ బ్రతీతికలదు. సాంగవేదోపవేదములు పదునాలుగు, మీమాంసా, తర్క, సాంఖ్య, వేదాంత, యోగే, తిహాస, పురాణా, స్మృతీ, నాస్తికమతా, ర్థశాస్త్ర, కామశాస్త్ర, శిల్పా, లంకృతి, కావ్య, దేశభాషా, వసరోక్తి, యావనమత, దేశాది ప్రచలితధర్మశాస్త్రము లివి పదునెనిమిదియుఁగలసి ముప్పదిరెండు. ఇంతియకాక, హావభావాదిసంయుక్తనర్తనాదికళలు గాంధర్వమున, శిరావ్రణవ్యధశల్య గూఢాహృతికరణములు, వృక్షాది ప్రసవారోపాదికరణములు, పాషాణధాత్వాదిధారణ భస్మకరణములు, యావదిక్షువికారకృతులు, ధాత్వౌషధిసంయోగక్రియలు, ధాతుసాంకర్యపార్థక్యకరణము లాయుర్వేదమున, వ్యూహరచనా యుద్ధసంయోజనాదికళలు ధనుర్వేదమున, మృత్తికాకాష్ఠ పాషాణ ధాతుభాండాది సత్క్రియాకళలు, చిత్రాద్యాలేఖనకళలు, పటబంధాదికరణకళలు, రత్నవేధాది స్వర్ణాది యాదార్థ్యజ్ఞానకాచపాత్రాదికరణ జ్ఞానకళలివి ముప్పదిరెండునుగలసి చతుష్షష్టికళలు, నీతిసారాది గ్రంథములందు సవిస్తరములు.

సాధారణముగఁ బ్రస్థానము లారంభవాదము, పరిణామవాదము, వివర్తవాదమని త్రివిధములు. ప్రథమము:—పార్థివజలీయతైజసవాయవీయములగు చతుర్విధపరమాణువులు ద్వ్యణుకాదిక్రమమున బ్రహ్మాండపర్యంతము జగతినారంభించును. కారణవ్యాపారమున నసత్కార్యము సముత్పన్నమగు

ననియుఁ దార్కిక మీమాంసకులమతము. ద్వితీయము:— సత్వరజస్తమోగుణాత్మకంబగు ప్రధానమే మహదహంకారాదిక్రమమున జగదాకృతినిఁ బరిణమించును. కార్యము పూర్వమందుండియుఁ గారణవ్యాపారమున నభివ్యక్తమయ్యెడి. ఇటుల సాంఖ్యయోగపాశుపతసమ్మతము. బ్రహ్మపరిణామము జగతనియు వైష్ణవమతము. తృతీయము:—స్వప్రకాశక పరమానందాద్వితీయమగు బ్రహ్మ స్వమాయావశంబున మిథ్యాజగదాకారంబునఁ గల్పితమగునని బ్రహ్మవాదుల సిద్ధాంతము.

సకలప్రస్థానకర్తలగు మహామునులకు వివర్తవాదమునఁ బర్యవసానమగుటంజేసి వేదాంతప్రతిపాద్యాద్వితీయుండగు పరమేశ్వరునియందే తాత్పర్యము. ఆమహామునులు సర్వజ్ఞులుకాని భ్రాంతులుకారు. కాని బహిర్విషయప్రవణాత్ములకు నాపాతపరమపురుషార్థమునఁ బ్రవేశముసంభవించునని నాస్తిక్యనివారణమునకై యామహామునులచేఁ బ్రకారభేదములు చూపఁబడెను. కాన వారియాశయముఁ దెలియలేమింజేసి వేదవిరుద్ధార్థమునఁ దదీయతాత్పర్యముత్ప్రేక్షించుచున్నవారలై తత్తన్మతబహుళగ్రహిళజనంబులు ఋజుకుటిలనానాగతులఁ బొందుటంబట్టియు నెల్లవారికి నంతఃకరణశుద్ధివశమునఁ బశ్చాదృజుమార్గాశ్రయణమున నే సన్మార్గప్రవేశము పర్యవసానమునఁ బరమేశ్వరప్రాప్తియు సంభవించునని దెలియవచ్చెడిని.

శ్లో॥ లసతేభూతికాయేన ద్విజరాజేనరాజతే
ఏకాత్మనే నమోనిత్యం హరయేచహరాయచ॥

ఉ. ఈధరణిఁ మహాజనుల♦హీనకళాధగులాత్మభారతీ
నాధుఁడెవానమంచుసుమ♦న;స్థితి దివ్యరసంబుగ్రోలుచుఁ
బోధమహాస్కులైరి, నుత♦భూరిధరోన్నతమానవల్లి గం
గాధరమాధవీకృతవి♦కాసవిలాసితయోగవైఖరిఁ.

తే. గీ. శ్రీనివాసాస్పదముభంగిఁ♦జెలఁగినాడ
గురుతరణి తనుహితకృపా♦సురుచివలన
నమరియున్నాడ, నేకాన్వ♦యాభిజాత
సౌమ్యసుమతిసీతారామ♦శాస్త్రియనఁగ. శ్రీ శ్రీ శ్రీ

---

